శ్రీ న్యైనమః.

శ్రీ మఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండైన
శ్రీమన్నారాయణ పదపద్మ పరిమిళిత మకరందపాన
జనిత పరమాహ్లాదుండగు
సందడి, నాగదాసుకవివర్యునిచే
భాగవతోత్తముల కత్యంతోప యుక్తంబుగా
రచియింపంబడిన

# శ్రీతత్వజ్ఞానోపేత శ్రీభగవద్గుణకీర్తనలు

ఇవి,
మహారాజశ్రీ, అన్నదేవరవీరేశలింగంగారి
సహాయమునుపొందిన
సదరు గ్రంథకర్తవుత్తరవుప్రకారం
చెన్నపట్టణం గుజరాతివీధియందలి ౨౯-నెంబరుగల
స్వగృహమునందుండు


వంకాయల- కృష్ణస్వామి శెట్టివారిచే
స్వకీయ
శ్రీరంగవిలాస ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపంబడియె.

౧౮౮౮ వ-సంవత్సరం.




దీనిక్రియం అణాలు ౩.

శ్రీ నైనమః.

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండైన
శ్రీమన్నారాయణ పదపద్మ పరిమిళిత మకరందపాన
జనిత పరమాహ్లాదుండగు
సందడి, నాగదాసుకవివర్యునిచే
భాగవతోత్తముల కత్యంతోపయుక్తంబుగా
రచియింపంబడిన

# శ్రీతత్వజ్ఞానోపేత శ్రీభగవద్గుణకీర్తనలు

ఇవి,
మహారాజశ్రీ, అన్నదేవరవీరేశలింగంగారి
సహాయమునుపొందిన
సదరు గ్రంథకర్తవుత్తరవుప్రకారం
చెన్నపట్టణం గుజరాతివీధియందలి ౪౯-నెంబరుగల
స్వగృహమునందుండు

## వంకాయల- కృష్ణస్వామి శెట్టివారిచే

స్వకీయ
శ్రీరంగవిలాస ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపంబడియె.

౧౮౮౮ వ-సంవత్సరం.



దీనిక్రయం. అణాలు 3.

## శ్రీరస్తు.

అస్మద్గురుభ్యోనమః.

## శ్రీ భగవద్గుణ కీర్తనలు.

సీ॥ శ్రీకరంబైన భూలోకమందున మేరు శైలదక్షిణమున చర్చసేయ। ఘనతజంబూద్వీపమునకర్మభూమిని వెలయునందిగ్రామ విషయమునను। కృష్ణానదోత్తరకూల నికటము నందుదనరుతిరుమలగిరి దాపునగుచు। ఈశాన్యభాగమందింపొందసిరులచే ప్రబలుచున్నట్టిదబ్బాకువల్లి। పురమునందుననివసించిపూర్ణకృపను। భక్తులనుబ్రోచుశ్రీహనుమంతువేడి। ప్రమదముప్పొంగశ్రీభగవద్గుణౌఘ। కీర్తనలుజెప్పబూనితిగీతసరణి॥

రాగం- శంకరాభరణం- ఆదితాళము.

శరణుశరణుశరణు శ్రీమన్నారాయణా। సకల- జగదుత్పత్తి స్థితిలయకారణనారాయణా॥ పరమపురుషా భక్తవరదనారాయణా- తత్వ- పంచకాతీతాప్రమేయనారాయణా॥ శరణు॥ ౧॥ సచ్చిదానందస్వరూపనారాయణా- సర్వ- సాక్షిచైతన్య శ్రీమన్నారాయణా - అచ్యుతానం

తాత్రపమత్తనారాయణా । సర్వ- ఆధారభూతాత్మ శ్రీమన్నారాయణా ॥
శరణు ॥ ౨ ॥ విశ్వరూపవిశ్వేశా శ్రీనారాయణా- నిఖిల - విశ్వాధార వి
శ్వాతీతనారాయణా - శశ్వత్పురుషా స్వప్రకాశనారాయణా । హరిద
శ్వచంద్రవహ్న్యముదీపనారాయణా ॥ శరణు ॥ ౩ ॥ సర్వభూతహృదయ
వాసనారాయణా - నిన్ను - సన్నుతింపనెంతవాడనారాయణా - నిర్వి
కారనిగమవేద్యనారాయణా- నా- నేరములెంచకనుబ్రోవునారాయణా ॥
శరణు ॥ ౪ ॥ దీనుడానని వేడుచుంటినారాయణా- నా - దిక్కుజూడవేమి
శ్రీమన్నారాయణా- ధ్యానపానజపతపపూజలునారాయణా- నేను- పూ
ని సేయలేక శ్రీమన్నారాయణా ॥ శరణు ॥ ౫ ॥ కరములూముకుళించి నేను
నారాయణా- నన్ను- కరుణింపుమని మ్రొక్కితి శ్రీమన్నాయణా- శరణన్నా
రక్షించేవిరుదునారాయణా, వున్నా- దారవానిసినువేడితి శ్రీమన్నారాయ
ణా ॥ శరణు ॥ ౬ ॥ జడుడనూ మూఢుడనూ శ్రీమన్నారాయణా- కల్మ- ష
డనుజ్ఞానహీనుడానునారాయణా- విడువనుభవదంఘ్రియుగము నారాయ
ణా- నన్ను- కడతేర్చూ-దుఃఖములూబాపినారాయణా ॥ శరణు ॥ ౭ ॥
తప్పులెన్నిదండించగనూనారాయణా- నా- వొప్పులుచేకొనిపోషించూ నా
రాయణా- తప్పులేకుండనునడువనారాయణా- నా తరమ శ్రీముఖ వారిజ
మిత్రనారాయణా ॥ శరణు ॥ ౮ ॥ కర్మత్రయము చేత శ్రీమన్నారాయణా
నీవై- ఘనుడవనుచు నమ్మితి శ్రీమన్నారాయణా - పరిహరింపతగవుగాదునా
రాయణా। నన్ను- పాలించుపాలించు శ్రీమన్నారాయణా ॥ శరణు ॥ ౯ ॥
పరులనువినుతింపలేకనారాయణా- నేని- పాలబడితినయ్య శ్రీమన్నారాయ
ణా- వెరపుదీర్చి యేలుకో శ్రీనారాయణా నాకుగుమపునీదైయుండబోవునా
రాణా ॥ శరణు ॥ ౧౦ ॥ తల్లివిదండ్రివినీవేనారాయణా- గురువు- దయివ
మైనానీవె శ్రీమన్నారాయణా, యల్లబాంధవులునునీవెనారాయణా-మాకు-
యున్నగాధనవిద్యలునీవెనారాయణా ॥ శరణు ॥ ౧౧ ॥ అన్నిటనీవేనని శ్రీ

మన్నారాయణా- ని- న్నాశ్రయించియు ంటినయ్య నారాయణా- పన్న
గేంద్రశయనా శ్రీమన్నారాయణా- ఆపన్నజనసంరక్షక శ్రీమన్నారాయ ॥
శరణు ॥ ౧౨ ॥ కాయముగేహంబిధనమునారాయ- నీ- పాయమానిశరణు
జొచ్చితినారాయ- మాయలోబడద్రోయకనన్నునారాయ- యికను మన్నిం
చుమన్నించు శ్రీమన్నారాయ ॥ శరణు ॥౧౩॥ నీదయనాప్రాప్తిబంధోనారా
యణ - నే- నిన్నేమంటునయ్య శ్రీమన్నారాయ- ఆదిఅంత్యములేని శ్రీమన్నారా
య- సచ్చిదాత్మ సర్వవ్యాపక శ్రీమన్నారాయ ॥ శరణు ॥ ౧౪ ॥ యోగీం
ద్రహృద్ధ్యానగమ్య నారాయ- సంపది- నాగవాసవరదా శ్రీమన్నారాయ-
నాగేంద్రసంరక్షక శ్రీనారాయ- లోక- నాథావైకుంఠవాసనారాయ॥ శర
ణుశరణు ॥ ౧౫ ॥

రాగం మధ్యమావతి - అటతాళం-

హరిహరీహరియనవే- ఓమనసా శ్రీ- హరిహరీహరియనవే ॥ హరి
హరీయనిస్మరణజేసిన- దురితములునశియించిమీదట- పరమపదమును జెంద
గలవిది- మరువకనునిరతంబును శ్రీ ॥హరి॥ ౧ ॥ నిలయముగాలగనూ - మూ
ఢాత్మ పోకడు। నీటికయినుయిుద్రవ్యనూ। దలచినటువలెముందరనుహరిదల
చినసద్గతిబొందగలనని కులుకుచుండెదవింత మత్తతవలమవలమయిప్పుడే శ్రీ॥
హరి ॥ ౨ ॥ కాయపోషణార్థంమై। శ్రమనొందెదవుబహు। కానకదుర్బు
ద్ధివై । హేయముకీకసములా। సముదాయముమృతిబొందినప్పుడు । ధ్యేయ
ముశునకములకనిత్యంపాయముగ నీతనువు నెంచియు ॥ హరి ॥ ౩ ॥ యు
క్కూడిబాంధవులూ। భార్యయుపుత్రు। లెకూడిస్నేహితులూ। వొకరూరయి
నవెంటరారు। వట్టియీభ్రమలన్నివిడిచి। చక్కగాపరమాత్మగొల్చిన సౌ
ఖ్యమును జెందెదవునిరతము ॥హరి॥ ౪ ॥ భూతమూలవలెనూ । బెదరింపు
చూయమ। దూతలుప్రాణములనూ।ఘాతజేసితీయుచుండెకాలమునతలిదం
డ్రులయినను। ప్రీతితోవిడిపింపగలరానీతిలోనీవిప్పుడె శ్రీ ॥హరి॥ ౫॥ ధనము
సంపాదించి। సాధులనుపే। దలను నిబంధించి। ఘనుడననుకొనిమిట్టి పడు

శేకాని సౌఖ్యముగలుగదందున- అనవరతమును దుఃఖములవర్ధనము తనమని తెలిసికొంటిని శ్రీ ॥ హరి ॥ ౬ ॥ అనిశముకర్మములా। గజిబిజినొంది । హరినిగాన వేలా । మనసువాక్కాయముల చే కాయనము జేసి యుతనువు మరిచియు। అసయమును పరమాత్మ ధ్యానానందమున బాష్పములుగురియగ॥ హరి ౭ ॥ పరమపదముగలుగు। లక్ష్మీశు సేవసు। భయము లెల్లదొలుగు। ధరనుసందడి। నాగదాసవరదపరమదయానిధే। నీమటుగుజొచ్చితిబ్రోవుమనవే నిరతమువో వేడ్కమనసా ॥ హరి॥ ౮ ॥

రాగం సావేరి- తాళము- ఆది-

నారాయణనారాయణ శ్రీమన్నారాయణ-శౌరి। వారణవరదమురారి త్రివిక్రమ। నారదనుతకంసారిపరాత్పర ॥ నారా ॥ ౧ ॥ పరమపురుష దేవకినందన। శ్రీధర కేశవమాధవగోవింద ॥ నారా ॥ ౨ ॥ దామోదరపీతాంబరధరకరుణామయా జగన్నాథముకుంద ॥ నారా ॥ ౩ ॥ విశ్వంభర సేవిత సురగణహరిదశ్వచంద్రమధ్యప్రదీపహరి ॥ ౪ ॥ పద్మనాభ శ్రీపతిగరుడధ్వజ పద్మభవార్చిత పాదచతుర్భుజ ॥ ౫ ॥ దేవదేవవందేవనమాలి రావ దేమి నను బ్రోవచక్రధర ॥ ౬ ॥ అప్రమేయపరమాత్మ జగద్గురుసుప్ర సాదమున జూడు నేడునను ॥ ౭ ॥ భోగిశయనమణి భూషణసందడి నాగదాస వరదాగమవేద్య ॥ నారా ॥ ౮ ॥

శంకరాభరణరాగము - అటతాళము-

నను బ్రోవరజగన్నాయకా। నిన్ను । నమ్మితిరా మోక్షదాయకా - దనుజకాననశుక్రముని హృద్వనజమధుకర నీలఘనసంహననని నిను నామనము లోననుదినము వినుతించితిని శ్రీహరి॥ నను॥౧॥ బృందారకమూర్ధభూషణా। రా। కేందువదనసుజనాపోషణా- వంది తేందుధ రేంద్రి రేశపురందరస్తుత దీనజనహరి- చందనాబలసుందరగోవిందనందసుతానందముగనీవు ॥ నను ॥ ౨॥ కరుణావారిధివీవుగావా। నన్ను। కరుణింపవేగమేరావా। తరుణపంకజ చరణదుర్జనహరణ హేమాభరణకోటి- తరణిప్రభ చేనున్నభవనిధి తరణ

హిమకిరణరుణనేత్రా॥ నను ॥ మంగాళాలయకంజలోచనాభ, క్తా। పుంగావపాపవిమోచనా। సంగరహితానంగజనకపతంగరాజతురంగభవజలధింగనగనుత్తుంగభంగములుంగడుకొ వెలుపించుచున్నవి ॥నను॥౪॥ దారిద్రకలుషసంహరణాభోగి। తల్పలోకత్రయకారణా। తారహారపటీరయశవిస్తారసందడినాగదాసుని। నేరమెన్నకబ్రోచెమురసంహారవారణవరద కేశవ ॥ నను ॥ ౫ ॥

కేదారగౌళరాగము- అటతాళము-

శరణాగతమనుజాదరణా సురవయిరిహరణాసరసిజచరణా వయికుంఠకరుణావనధే। నిమ్మనిధే।స్వశ్రేయసగుణాంబుధే॥శర ॥ పరమపురుషాచరచరములకు యిరువునీవయికనుఞాూడక దురితములపాజ్జ్యసితి వినీసరిమహాత్మకునెవ్వరికహరి ॥శర ॥ సతతంబునన్ను- దుమతులసంగముబాపి। హితునిగబూడరాదో। నీపాదములే।గతియానినమ్మలేదా।నాతోవాదా ఇతరదయివములనుగణెంపక।నతులితుడవనినిన్నెనంమితి॥ వితధవచనముగాదుయిదినీమతినియెటువలెదలచెదవాకద॥శర॥౨॥పుడమిలోపలనున్నజడులాను।నేనుయెప్పుదుగొల్వగాలేకా।తలచితినిన్ను-ఝుడియాకయిచిగాకా।వేరికలేక। యిదుములనుబడజేయకికనీయడుగులకుమ్రొక్కెదనురా।నానుడివినీయదలోననుంచుము। కడవిసెజ్జామూఢుడనకను ॥శర॥౩॥ కరిరాజవరదానీ చరణయుగ్మమెమున్ను। మరువకధ్యానింపుచూ। మోక్షాధ్వమున । నరుగూచువిధినెంచుచూ। నిన్నునుగాంచుచూ। పరమసుఖమునుజెందిరనియీా ధరణిలోబుధవరులుజెప్పగకరుణజూచెదవనుచునేనీమరుగుజొచ్చితిమురదనుజహర ॥ శర॥౪॥ భాషాధిపజనక। పాలించితేనన్నుదోషామాజితకామీ। సందడినాగదాసపోషిదియేమీ। పాపముస్వామీ। దాసమానసవాసకాంచననాసవాసవవినుతనన్నిటు। మోసపుచ్చుటన్యాయమటరా యోసమానాధికవిరహితా ॥ శరణాగతమనుజా ॥౫॥

# శ్రీ భగవద్గుణకీర్తనలు.

ఆనందభైరవి రాగం - ఆదితాళం.

ఇందిరేశా నన్ను బ్రోవరా । గజరాజవరదా । ఇందిరేశా నన్ను బ్రోవరా॥ ఇందిరేశ మునీంద్రవందిత- సుందరాంగశ్రుతి। వేద్యపూజ్యమేధ్యసాధ్య యిందుముఖభవుడాదిగా నరవిందసంభవ। వందితేందుకుందకీర్తి॥ఇంది॥ ౧॥
నీరజాక్షా నిన్నే వేడితి। యితరదైవములా। మేరుధీరా మదిని వీడితి మారజనక సురారిసంహార ఘోరపంకము। ణంచి యెంచి దృచితమనుచు। నేరుపుతో నాకోరికొసగును భూరిశౌర్యము। రారి పారావారాశయన॥ ఇంది॥ ౨॥
కోమలాంగా క్రూరసంహారా। నీపాదాబ్జములూ। నామనంబునందు నిల్పరా। తామసుండను పామరాత్ముడ స్వామి నన్నిపు డేలు మేలు చాలునింతె । సోమధరనుత భీమవిక్రమ హేమవసన శ్రీ। రామపూత నామధామ॥ ఇంది॥ ౩॥
చింతమాన్పి బ్రోవరావా। నామీదనీకూ। సంతమా మహానుభావా। దంతినుతనిన్నెంత వేడిన అంతకంతకు। చింతస్వాంతమంతగప్పె। యంతకఠినపు మానసమొ - కాసింతగరుగదు - శాంతానుక్రోశాంతరంగ॥ ఇంది॥౪॥
వాసవాదిదేవాపోషణా- సందడి నాగ- దాసవరదా- శత్రుభీషణా - వ్యాససద్గుణావాసహృదయనివాస సర్వము- నిండిపండియుండినన్ను- మోసపుచ్చుట న్యాయమా మందహాససజ్జన- త్రాసనిజిత లాసమాన॥ఇంది॥౫॥

రేగుప్తి రాగం- అటతాళం-

శ్రీరామ నను బ్రోవరాదా- నేడు- శిష్టవ్యాహర్చితా పాదా॥ పారావారశయన పంకేరుహాక్ష మద్ఘోరకిల్బిషముల దూరంబుగను ద్రోలి॥శ్రీరామ॥౧
యిందుసంకాశాశ్వరారా మౌని- బృందవందిత మేరుధీరా వందారుమందారుడంచు నిను సాధు విందిరానాథ తద్విధమూనవైనాను॥ శ్రీరా॥౨॥
దీనసంత్రాణనిపుణ గా- మాకు- హీనత్వమా యెను మెండుగా- మానై నన్నీ నీపు మనకు వతో బూపి- దీనత్వ మెడలింపవిరుకు నీవనే యుంటి॥ శ్రీరా॥ ౩॥
సంతతేమెలర శత్రుభీషణా- నాపై- సంతతంబు భువులోకపోషణా - దంతిరక్షక దైత్యధ్వాంత భాస్కర నాస్వాంతాంతరాళమున శ్రాంబునివసించి॥శ్రీరా॥౪

భోగితల్పకసత్కృపాకరా - జన్మ - సాగరమెడలింపవేమిరా - యోగీశ్వరేశ్వరాబాగుగానెల్లప్రభు నాగదాసునేలి నావానివింటినీ ॥ శ్రీరామ॥ ౫॥

శహానరాగం-ఆదితాళం-

రామునిదలువవె నీమముతో మనసా - కామితార్థంబులొసగు ప్రేమతో నిచ్చుగాన॥ రాముని॥ దేహమనిత్యమాని- తెలియకతుచ్ఛమైన- మోహజాలమునబడియూ మోసపోవకనిక వేగ॥ రాముని॥ కామమోహములచేకాలముజరుపకను- తామసములనుద్యజించి ప్రేమతో ముక్తిగోరి ॥ రాముని ॥ ఖేదమోదములనెల్ల పామపెకలించేటి - వేదాంతవేద్యునిపాదసేవయుగోరి॥ రాము॥ భావములో షడ్భావతీతునిపాద-సేవజేసిన జన్మపావన మౌనుగాన రాము॥ రాగద్వేషములను వేగమెబాపిసండడినాగదాసునిబ్రోచేఆగమవేద్యుడైన॥ రామునిదలువవె॥ ౬॥

నాథనామక్రియరాగం-ఏకతాళం

శ్రీరుక్మిణీశ. శ్రీరుక్మిణీశ- శ్రీరుక్మిణీశరారారుక్మిణీశ ॥ కరుణింపుమాని- శరణన్నవాని- దరిజేర్చుపూని- దర్పముమాని॥శ్రీ॥ సురమౌనిస్తోత్రసుందరగాత్ర- వారిజానేత్ర- వాణీశమిత్ర॥ శ్రీ ॥ వనధిగంభీర- నినునమ్మినార- దనుజసంహార వనజాక్షరారా॥ శ్రీ॥ భవములగెంటి - పాలింపుమంటి- నీవేదిక్కంటి నేతమికంటి॥ శ్రీ॥ గరుడతురంగ - కలుషవిభంగ - రారనిస్సంగ- రక్షింపరంగ॥ శ్రీ॥ కేశవరావు పోషింపనీవు- దాసుడగావు- దయవీడచేవు॥ శ్రీ॥ జగమునీలీల- జేసితివేల- నాగాఖ్యపాల- నయగుణశీల॥శ్రీ॥

నాథనామక్రియరాగం- ఏకతాళం

శ్రీనారసింహ - శ్రీనారసింహ- శ్రీనారసింహ - లక్ష్మీనారసింహ ॥ అక్షీణకరుణాకటాక్షంబుతోనన్ను- రక్షించు వేగ జ్వాలానారసింహ॥శ్రీ॥సం

దేహాములబాపిపొందుగానస్నేలు- వందితమునియోగనందననరసింహా॥శ్రీ-

సింహా॥శ్రీ॥

పామరత్వముబాపిప్రేమతోరక్షించు- భీమసన్నుత సాలగ్రామనరసింహా॥

శ్రీ॥ సురుచిరమైననీసుందరమునుజూపి- కరుణించుననుగరుడగిరినారసింహా॥

శ్రీ॥ గిరులోలోను త్తమగిరియైన యామ్నాయగిరియందువెలసిన వీరపునర

ధారుణిశ్రీకృష్ణతీరమందుననిల్చి-చారుభక్తులబ్రోచెస్వామినరసింహశ్రీనా॥

వాసవాచ్ఛితమందహాసనందడినాగదాసహృత్కమల నివాసనరసింహా॥శ్రీ॥

యమునాకల్యాణిరాగం-ఆదితాళం

హరీహరీయనిస్మరించితేనా మొరాలింపవేర - కరీంద్రనుతసుస్థిరంబుగ

నుసద్వరంబొసంగుము-మురాసురాంతక-హరీ-పరాకేల యిందిరారమణ

సుందరాకారశౌరీ-నిరాకారనీస్వరూపుజూపియు బిరాననేలుమునిరాకరిం

చక-హరీ- సురాసురలకునుసుఖాసుఖంబులునిరంతరంబొసగి-చరాచరము

లకుపరాత్పరుడవై ధరన్వెలిగెమందరాద్రిశ్రీ-హరీ-రయంబుననునీదయారస

ము:నాపయిజిలికిబాగా-నియామకనుగామయాదికల్పిష భయంబుబాపు

ముసుయక్షేశశ్రీ హరీ-ఇనాబ్జలోచనఘనంబుగానామనంబులోపలనూ-సనా

తనాత్మనుగనుంగొనెటిసాధనంబుదెల్పుముజనార్దనాచ్యుత హరీ- శివంక

రంబగుభవత్పదాంబుజ-స్తవంబుజేసెదనూ - భవంబుబాపుము భవాంబురు

హసంభవాదినుతమాధవాబ్జనాభ-హరీ-రమామనోహర శమాదిగుణయు

తసమాధిబలమొసగి-భ్రమాదిదుర్గుణసమూహమునుబాపుమూవేగ నిరు

పమాన తేజ-హరీ-కవిసందడినాగదాసహృత్పద్మవాసగోవిందాశివావినుత

శ్రీధవామరార్చితరవీందుమధ్యమధ్యవకప్రకాశ-హరీ ౧౧

### కేదారగౌళరాగం - అటతాళము-

నారాయణవాసుదేవా- నిన్ను- నమ్మియుంటినిలోకనాథసద్భావా॥
నారా॥ ఘోరసంసారాంధ- కారభాస్కరనిన్ను జేరిసంతోషించు దారి
దెల్పుమువేగ ॥నా॥ దేవాదిదేవగోవింద నిఖిల దీనజనపోషమదిజాత దై
త్యబృందా- బ్రోవుమనుచునిన్నుభావమందుననిల్పి సేవజేసిననన్నుబ్రోవరా
విదియేమి ॥నారా॥ కందర్పజనకసర్వేశా- సకల- కలుషవాసవహృద్భిక
రస్వప్రకాశా- యిందిరాహృదయారవింద యిదిందిరానందదాయక నా
తోనెంచుకీపంతంబు ॥నారా॥ వేదాంతవేద్యానీపాదా - సేవ - విడువకుం
టినినాపైప్రేమిలేదా- నీదవాడనినన్నుసాదసుండటకమణనుగాదుమేప
నిదయునాగావుసర్వాత్మకా ॥నారా॥ దంతిరక్షకహేమాభరణా । మో
క్షా- దాయాకాఖిలకలుషితమయూఖ్యాణకిరణా - సంతతంబునునా హృదం
తరాళమునశాంతంబునీపాదచింతగల్గజేయు ॥నారా॥ సరసీరుహాక్షదై
త్యారి- నిన్ను- సన్నుతింపుచునుందుపరమాత్మ శౌరి-ధరనుసందడినాగ దా
సపోషకనీవు- మరుగుజొచ్చితి నన్నుకరుణించుమీవేళ ॥నారాయణ॥

### నవరోజురాగం - ఆదితాళము;

వందనమిదుగోశౌరీ- వారిజాసేత్రాదయిత్యారీ॥ మందరధర నిను
జేరీ- మనుజులావిడితినుతెసూరీ ॥వంద॥ చలముశేయకననుగావూ- సర్వలో
కాధారానీవూ- చలనగుణములెల్లాబోవూ సరణీదెల్పకకోరికలులేవూ॥
వం॥ నెపములెన్నకనాపాపా- మిపుడెబాపుముజితతాపా - జపితముని
మానసగుహాదీపా- సచ్చిదానందారూపా ॥వం॥ కందర్పతుల్యాకారా,
కఠినదానవసంహారా- పొంచుగానన్నేలరారా- యిందిరా చిత్తాచోరా॥
వం॥ మందసుందరానాసా- మనుజగణకల్పితవిలాసా- సందడినాగదాసా
సన్నుతాహేమానాసా॥వందన॥

### పంతువరాళిరాగము - అటతాళము-

ఇపుడెగోవిందయనవే- వామనపానీ- విప్రుడేగోవిందయనవే ॥ఇపు॥

డేగోవిందాని ॥ జపముజేయుచునున్న నెపములెన్నక ముందుకృపతో మోక్షము సంగు ॥ఇపు॥ ఆలుపిల్లలసమ్మియూ- శాస్త్రార్థంబు - లన్ని వేగరజిమ్మియూ- బాలాశాలాదిసలోలుత్తై మీదట- కాలమెరుగనిజనులకష్టమే- మసవచ్చు ॥నిపు॥ జనియించినదిమొదలూ- మృత్యువుసర్వజనులవెంటనె యుండియూ- పనిబూనియెప్పుడో ప్రాణముల్ దీసునూ- గనుకద్రవ్యాదుల కాంక్షవిసర్జించి ॥ఇపు॥ దారుణాకారులయినా- యమదూతలు-దండించుసమయమునా- నారాయణయనికోరిభజింపని- కారణంబునయిట్టిగతిగల్గె ననకానూ ॥ఇపు॥ వాసుదేవకేశవా సందడినాగదాసపోషకమాధవా - భాసురాంగనన్ను పాలింపుమనుచును- దోసిలొగ్గి సేవజేసినసుఖమబ్బు ॥ ఇపుడె గోవిందయనవే॥

యమునాకళ్యాణిరాగము - ఆదితాళము-

పాహిమాంరామ- పరజనభీమా॥ పాహిచరాచరదేహీరూప జీతమోహకృష్ణఘనదేహపరాత్పర ॥పాహి॥ దనుజనికరఘనవనదహనామర- వినుతజననమరణనివారణహరి ॥పాహి॥ కరివరదధరమాధరకరుణాకర పరమపురుషసురుచిరదరహాస ॥పాహి॥ అతిధృతియుతనిర్జితపతితాసుర పతగకులోద్భవనుతశితికంఠ ॥పాహి॥ అరుణకమలనిభచరణభవాంబుధి తరణతరణిహిమకిరణనయనహరి ॥పాహి॥ త్రాసహరణరవిభాస నాగదాసమానసనివాసమహేశా ॥పాహి॥

రేగుప్తిరాగము- అటతాళము-

రామానామనవిచేకోరా- పరం- ధామమొక్కెదనిందురారా ॥ కామజనకనిన్ను ప్రేమతోవేడితె- సామజవరదనీ మోముజూపవదేరా ॥రామ॥ ఘనసూర్యవంశప్రకాశా- స్వామి మునిసంఘవినుతరమేశా - అనుదినమునుభక్తజనులానుబ్రోచేటి. దనుజాంతకశౌరిదినకరశశినేత్రా ॥రామ॥ పుండరీకాక్షగోవిందా- నీయండచేరితినిముకుందా. దండిగదురితవిఖండన - దయిత్యప్రచండనయినవంశమండనాశ్రితపోష ॥రామ॥ రాకేందువదనశ్రీ

రామా త్రైలోకపోషక మామమామా- పాకశాసనవినుత సాకేతపురివా
సా- సోకుమూకలకొంగసూరిజనసన్నుత ॥రామ॥ కరిప్రస్తోమపుల మెచ్చి, ము
క్తికరతలామలకముగనిచ్చి- ధరనుదబ్బాకుపల్లివరహనుమంతూనికయ్యతో
నెల్లప్పుడుగారవించినసామి, రామ, భాసురాంభోరుహనేత్రా - సకల -
పాపకర్మసమూహజైత్రా- వాసిగననుబ్రోవునాసవాచిర్త నాగదాపః
పృతల్పమలనివాసజానకిరమణా, రామానామనవిచేకోరా॥

## నిరోష్ఠిభగవద్గుణ కీర్తనము-



మధ్యమావతిరాగము - అటతాళము॥

రారాశ్రీకృష్ణా- నన్నేలనిటు- రారాశ్రీకృష్ణా॥ రారాశ్రీకృష్ణయీ
ధారుణిస్థలినిన్నుకోరితల్చుచునుంటిచారుసుందరగాత్ర ॥ రారా ॥ కరుణ
లేదటరా- నాయెడనీకుకలుషసంహారా- అరయగనిన్నుసహాయాకరుండనిసూరి
నరులుదల్తురునిత్యనగధ రాచ్యుతశౌరి ॥రారా ॥

కనకాద్రిధీరా. నిర్జరకోటికాయజకారా- జననానాశత్రాసలును
లేనిదైత్యారి- ననుదూరనాడుటన్యాయసరణిగాదు ॥రారా ॥
కరిరాజరక్షా, నిఖిలరా, క్షసంఘశిక్షా- దరిజేర్చసంసారజలధిలోజడ
నీక- కరుణారసార్ద్రహృత్కంజయాశ్రితత్రాత॥రారా॥దనుజౌఘజైత్రా
సందడినాగ, దాససంస్తోత్రా కనకసుందరచేల ఘనసంకాశశరీర-సనక
సన్నుతనిఖిలసాక్షిచిదానంద ॥రారా॥ రారాశ్రీకృష్ణా-నన్నేలనిటు- రా
రాశ్రీకృష్ణా॥

ఉ ॥ యెట్టిదురాత్ముడయిన పరమేశనిను। స్మరణంబువేడచే । పట్టి
యనుగ్రహింతువనిపండితులందురు గానతప్పులు।న్నట్టికనామనంబునిరుపా
ధికచిత్సుఖమందులియ్యమీ। పట్టునజేయునామనవి భావములోపలనుంచి
శ్రీపతీ ॥

శంకరాభరణము- అటతాళము-

నీదెభారము- నసుబ్రోవపరులవి- గాదీభారము, నీదేభారామునిఖిలదేవార్చిత వేదాంత వేద్యునన్నాదరించుటకును ,నీదె, కరుణాకర కేశవా- భవాంబునిధి- తరణాసూరి స్తవ। పారావారగంభీరనాహృదయము జేరినకామాదిశత్రులదుంచను,నీదే॰ ఆదిమధ్యాంతములును- లేకనుగలిగి నట్లుచోచియుమీదనూ- యేదకుజూచిన భేదస్వరూపమునవాదించుప్రకృతీనిపోవోలుటకుయికను,నీదే, డెందమెల్లప్పుడున్నూ- యింద్రియబృంద- మందుజందనీకనూ- అందాముగనుసచ్చిదానందమయననునీయందున నయిక్యాము పొందించుకొనుటకును,నీదే, చింతలన్నియుబాపియు- పరమాత్ముని- చింతగలగగజేసియు- అంతబాహ్యాదృశ్యముంచినీ వెనిలిచి- శాంతామలముగ నాస్వాంతంబుజేయుటకు.నీదే, జ్ఞానానందమూర్తీ- సత్స్వరూప- భానుచంద్రాంతర్వర్తీ- జ్ఞానాజ్ఞానాలములుగానినిత్యానందజ్ఞానంబు నాహృదయధ్యానగమ్యముజేయు,నీదే, నారాయణదేవదేవా - నీపాదములే- నమ్మితిమహానుభావ- రారాదీనమందార మోక్షముయాధిగనిచ్చి నాకోరికదీర్చను, నీదే, వ్యాసాదిమౌనిస్తవ సుందశేనాగ- దాసవందితమాధవా - వాసవార్చితముందహాసజన్మమరణత్రాసమెడబాపి సంతోషునిజేయుటకు, నీదేభారము ||౧౨||

అసావేరిరాగము- ఆటతాళం-

శ్రీలక్ష్మీనాథనాచిత్తములోనిలచి- చింతలన్నియుబాపరా, కాలాభ్రసంకాశగాత్రసజ్జనవంద్య- ఫాలాక్షువినుతనేడూ- ఘృణతోజూడు, శ్రీలక్ష్మీ, ఇందిరాహృదయారవిందారవిందాక్ష- సందేహమునుజేయకా-యింకవేంచేయురా కేందుసన్నిభవదన- నందనందనసుకుమారా- చలమేలరా, శ్రీలక్ష్మీ, పదులగహింంచుముద్భావంబులనుద్ధరించిధర ధారస్తవబ్రోవరా- సురమానసహృదయతామరసభాసకర ఘోరాసురవల్లియాలవిత్రా- సరసిజనేత్రా, శ్రీలక్ష్మీ, సోమార్కనయనదాసోహంబటంచు నాస్వామివీవని న

స్మితీ- కామజనకనాపై ప్రేమలేదాయెనిస్నేమంచు వైరిభీమా - సద్గుణధా
మ॥శ్రీ॥దాసకిల్బిషభంగ శైవాలలామకంజాసనవినుత సేదూ - పోషించుననను
మందహాససందడినాగ- దాసహృత్కమలవాస, రవిశతభాస- శ్రీలక్ష్మీ
నాథ॥

సావేరిరాగము.ఆటతాళము

వినవెశర్వాణిశ్రీరామ- కథస. విస్తారంబుగనుయోభామా-దనుజులాది
తేయులనునిర్బంధింపగ-జనినారాయణునకడకువినుతిశేయగను - దనుజమర్ద
నుడనివెమీరలు-జననమొందుడివానరులునయినకులంబునబుట్టెదను నేనను
చునప్పుడదృశ్యుడాయెను- వినవె- దశరథుడతిశీఘ్రముననూ - ధరణి.దశర
థునకునుతనయునిగను-యశముచంద్రికగెల్చిదిశలాక్రమింపగను, భృశనీల
గాత్రుడైపుట్టెరాఘవుడు- నిశిచరులమనుమాడగౌశికునిలయమును సౌమిత్రి
తోజనినిశితమార్గణములనుతాటకనేలపైబడనేసెనప్పుడు ॥ విన॥
హితవుదైత్యులదుంచి-మౌనిక్రతురణకుణంబొనరించి॥ యతితోజనాహ
ల్యసతిశాపమునుబాపి శితికంఠుచాపమణిధృతితోనువిరచిభూ- సుతనుపెంతి
లియాడిమోదంబతిశయింపగపరశురామునిధృతివిహీనునిజేస్య యోధ్యాక
తిరయంబునవచ్చిరప్పుడు॥ వినవే॥ శ్రీరామపట్టాభిషేక- మునకు- ప్రారం
భించినదోచికయిక॥ ఆరాముడపుడుజనకాజ్ఞాచేసౌమిత్రి - ధారుణిసుత
గొల్వతరలెచిత్రకూట. ధారుణీధరముననుఖరహృద్దారుతంబునుచీసిదూష
ణుఘోరరణమునగూల్చిమృగమైపారినమారీచువ్రంచెను॥వినవె॥ సీతజాడ
జటాయుచేత- వినియా- శ్రీరాముదువాలిభ్రాత॥మాతరాగనివానిచేతకా
ర్యముదెలసి- ఖ్యాతిగవాలిని-భూతలంబునగూల్చి- ప్రీతితోరవిజునకు పట్టం
బాతరినిగట్టించి పృథ్వీజాతవార్తయుదెలిశిరంమని వాతసూనుని బంపెన
ప్పుడు॥వినవె॥అపుడుమారుతివార్ధిగడచీ- లంకా- ధిపునిపట్టణముననిలిచీ
విపరీతగతులనావీధులన్నివెదకె- చపలాక్షిసీతకిచ్చెనురామముద్రిక-అపుడు
సీతాజ్ఞయునుగొనియాయక్షయునిచనుమాడి లంకనునిపుణమతిచే గాల్చి

రామునకప్పుడు రత్నంబిచ్చి చెప్పెను॥వినవె॥ మానుగ రాఘవుడు మెచ్చి- రా
వణానుజునకు నభయమిచ్చి॥ పూని వారిధిఁ గట్టి- మానవాధిపుఁడు యావా
నరులతో గూడి దాసవేశ్వరునీ- సూనులను బాంధవులు మిత్రుల మానకను బరి
మార్చి లంకకు కృశాను పాలుగ జేసి యాచిరి వానరులు చలరేగి యప్పుడు॥
వినవే॥ రాముడు విల్లెక్కు బెట్టి- ఘటకర్ణాది రాక్షసులను గొట్టి॥ తామ
సంబున దశమస్తకుని భీకర బాణ- స్తోమము చే వాని భూమిపయి బడ గూల్చి-
ప్రేమతో లంకాపురమునకు స్వామి జేసి విభీషణుని యా రామచంద్రుడు సీత
గూడి యుపాయమున పుష్పకము నెక్కెరి॥ వినవె॥ బారులయి కపులెల్ల రాగ
ముందు- ధీరుడయి హనుమంతుడు బోగ- జేరి రయోధ్యా జనులు నుతింపగ నా
రామలక్ష్మణులు లవనిజ కపులు, వారకను వాసిష్ఠ మౌనిని జేరి శ్రీరామునకు-
నిర్మలవారితో పట్టాభిషేకము కోరి కలరగ జేసిరప్పుడు ॥ వినవె శర్వాణి॥
ఇలలోను దాసుల బ్రోవ- భద్రాచలమున నిలిచియున్నావా॥ కులుకుచు సీ
తను గూడియున్న నిన్ను; పలుమారు సాధులు భక్తియుక్తులునై- గొలుచుచ నవ
రతంబు మిక్కిలి చలనరహితంబయిన నీ పదనళిన భక్తియొసంగు సందడి నాగదా
సహృదేశయనిరిటు॥వినవెశ॥ ౧౪

కల్యాణి రాగం- ఆట తాళం-

దశరథాత్మజ రామ- వందితవిధిత్రి- దశశక్రాదిస్తోమ ॥ దశరథాత్మజనీ
పాదద్వంద్వమును నాహృ, ద్వశము జేయుము సర్వాతిశయ సద్గుణపూర్ణ-
గుణ విశాల దయా పయోనిధి భృశ నిశాచర వనధనంజయ కుశరుహాయత నే
త్ర పురుకర్కశ సువక్షోధరా సుతప్రియ॥దశరథా॥ పారావారబంధన- సద్గుణ
సం- దారౌఘహారి చందనా- రార నా మనవి చేకోర మదభీష్టాము వీర మేరుస
మానధీర ధారాధరశ, రీరకరుణాపూర హృదయ యపారవిక్రమ ధారుణీధ
వ సూరిజనహృత్పుండరీకవిహార ఘోరవికారదూర॥దశరథా॥తరుణపంకజ
పాద నిర్జిత సర్వ- దురిత దానవమోద- నిరుపమాకార నన్నరమార శే
షాంక; కరుణించుము వేదపురుషోత్తమ శౌరి- ఘనక దాస్యము మండనా శ్రితవర

శిఖరిదూషణవిఖండన స్మరశతాధికసుందర శ్రీకరహరస్తుత పరవిమర్దనశర ధా॥శీలగుణపరిపూర్ణకాంచనరత్న-జాలకుండలకర్ణా- పాలించు కవన్నీలనీరదదేహ- ఫాలాక్షసతిజపితభవ రుగ్భేషజనామ; మేలనాపై నింతనిర్దయచాలనేడితిబోవ్రుశీతా- లోలసందడినాగదాస సుపాలశీలదయాలవాల॥ దశరథాత్మజరామ॥

యమునాకల్యాణి రాగం-ఆది తాళం

వాసుదేవ తేన మోన మో- భవ- వార్ధితరణ తేన మోన మో॥వాసవసుత తే వనజోదర తే- భాను రాంగ తేన మోన మో॥ నిరు - పమానంద తే న మోన మో॥వాసు॥ పరమపురుష తేన మోన మో- శశి- భాను నేత్ర తేన మోన మో-శరధిగభీర తే శేషశాయి తేదురితదూర తేన మోన మో, భీకరరిపుహర తేన మోన మో- వాసు- దామోదర తే న మోన మో- సుం - దరావయవ తేన మోన మో- భీమవినుత తే భేదరహిత తే సామజవరద తే న మోన మో- నర- సాధ్వసహర తేన మోన మో ॥ వాసు ॥ హృషీకేశ తే న మోన మో- ప్రహ్లాదవరద తేన మోన మో చాపాశరసందోహహరణ తే భాషాశ్వ సుర తేన మోన మో-వర భ మణివసన తేన మోన మో॥వాసు॥గరుడధ్వజ తేన మోన మోమంగళాయతన తేన మోన మో-సుర దానవ పూర్ణధరశతకోటి తే చిరస్వరూప తే న మోన మో- సచ్చిదానంద తేన మోన మో,వాసు-అప్రమేయ తేన మోన మో- అవ్యయానంద తేన మోన మో- సుప్రసాద తే-సుగుణ పుర్య తే స్వప్రకాశ తే న మోన మో- శే- చకాభృగేహ తేన మోన మో॥ వా ॥ యోగివినుత తేన మోన మో- భవ - నోగ వైద్య తేన మోన మో - నాగదాసహృన్నిళినవాస తేఆగమవేద్య తేన మోన మో- భూతాత్మరూప తేన మోన మో-వాసుదేవ తేన మోన మో- 16

యమునాకల్యాణి రాగం-ఆట తాళం

శ్రీరమావదనాబ్జసూర- రారవేగదశావతార - మేరునగసమధీరనీపద నీరజంబులనమ్మినాదగుభారమంతయునీదెయనిపలుమారునేడితిబోవ్రుమిక

నను. శ్రీరమా-కోమలాంగకూ్రరసంహార-భీమవంద్యభక్తమందార- సోమ
కాసురుడంబుజాసను ధామమననిగమములుగొనిచన తామసంబున మీనరూ
పముదాల్చి వానివధించిమించిన॥శ్రీరమా॥వాసుదేవవనజదళాక్ష- భీసమేత
దైతేయశిక్ష.వాసవాదిదివౌకసులకృపజేసివిబుధిలోకూర్మరూపము-భాసు
రంబుగదాల్చిమందరపర్వతమునవలీలనెత్తిన ॥ శ్రీరమా॥ పరమపురుషభవ
రోగవైద్యదురితభంజిత వేదాంతవేద్య- ధరణిచాపగజుట్టుకొని మోదము
నజనుకనకాక్షునీసూకరముగాజనియించిద్రుంచియుధరణిమునుపటివలెనొ
నరించిన॥శ్రీ॥ దంతివరదదైవాలలామ- చింతమాన్పిబ్రోవవదేవా-సంతతం
బును హేమకశిపుడుసాధుగోబ్రాహ్మణసురాళికి వంతగలుగగజేయనరహ
రివైఖరినిజనియించిచంపిన॥శ్రీ॥చారుధారాధరనీలగాత్ర- పారవారాశయ
సాధుజైత్ర- ధీరమతిబలిముజ్జగంబులభారకుడునైసురలదోలిన కారణంబున
వామనుడవైకరినముగబలినణగదొ్రక్కిన॥శ్రీ॥ కమలనాభకరుణాంతరంగ
విమలభక్తహృదయాబ్జభృంగ- ప్రమదమునచక్రంబునీతో పంతమాడియును
జూనాఖ్యునమరబుట్టినపరశురాముడవైవధించిద్విజాళిదనిపిన॥శ్రీ॥ పామ
రుండనసుచునామీద- పంతగించదగదుప్రమోద తామసంబున రావణుండ
మృతాంధసులబహుబాధపెట్టగ రామనామముచేతదశరథ రాజుకునుజని
యించిద్రుంచిన॥ శ్రీ॥ సచ్చిదానందస్వరూప- చంద్రసూర్యమధ్యప్రదీప-
కుత్సితులదునుమాడుటకుశ్రీకృష్ణునితో బలరాముడనగను - సచ్చరిత్రజనించి
ఖలులనుసంహరించియుబుధులబ్రోచిన॥ శ్రీ ॥ నిర్వికారనిర్జితతాప సర్వ
భూతహృదయనివాస గర్వమునత్రిపురాసురలుత్రిజగములుగొనగ నిబద్ధు
డవునైశర్వునితోగూడుకొనివారలసంహరించియుకీర్తిగాంచిన॥ శ్రీ॥పుండ
రీకనయనగోవింద.భోగిశయననిరుపమానంద- చండతరదుష్టములయి
జనులుండుదుర్కలియుగముకడపట పండితావనకల్కివైబహుభంగులను
దండించిబ్రోతువు॥శ్రీ॥ భానుకోటినైజప్రకాశ- బ్రహ్మజనకసకలలోకేశా-
దీనపోషకసన్నుతాఖిలదేవసందడినాగదాసునిమానసాబ్జనివాసకేశవమా

భవాచ్యుతవిట్టరశ్రేవ ॥శ్రీరామాపదనాబ్జసూరా॥ ౧౮

యమునాకళ్యాణిరాగం- ఖండజాతితాళం-

శ్రీరామామణి- ముఖపంకజరవివేగ- వారిజాక్షరార॥ సూరివందిత నా- భారమునిదె- కోరివేడితి- వాస్పైదయచేరధీమతి- నన్నుతగుణవార సుథుతి- ఖండితవిబుధారిసంహతి॥ నిరాకరించక స్థిరంబుగానాకోరంగాసంగుము- మేరుధీరచారుగాత్రహరి॥ ధారుణినేతా- మురసంహారసుదాత-సేవితవరబృందారకమాత- పోషితసంచారసఘాత. పరాత్పరవార దేవేంద్ర ప్రీతా- స్రష్టతాత- ధీసమేత- సపేత॥ చారుచేతోరహములయంబుదార కీర్తిదూరితార్తిహారి ॥శ్రీరామామణి॥

పంతమేలం- సనకాదిహృ- త్సన్నిచందరా॥ యింతటనయిన నన్నేలర శ్రీకంఠకాంతసన్నుతనామ॥ చింతవినాశ- నిను ప్రార్థింతు సురేశ - దురితౌఘధ్వాంతదినేశ- రవికోటిదిగంతప్రకాశ॥ నిను నేచింత శేయ నెంతవాడనోహరి యనంతరూపభ్రాంతిబాపి శాంతి మునగను॥ యింతటనీశ- ననుకరుణించుమ్మ పేశ- నివశితమునిస్వాంతేశ- సురారాతిహంతి జన్మపాశ- నీలకేశ-మూరితాశ మహేశ- సుందరవరనాంబుజాప్తునింతెచాలునిక దనుజాంతకాంతకాదివినుతశ్రీహరి ॥శ్రీరామ॥

కోమలాంగ- యమునంశాఖినోమునోపకామ- యేమారునేనిన్వేడిన దయరాదస్వామిసజ్జనరక్షక. సామజపోష. మంజులతరనామున వేష- కపిసన్నుతనామసుభాష రాత్రించరస్తోమమ్మాపై ద్వేష = సర్వాంతర్యామి నీమహత్వమెన్నజాలరజామరాదివ్యోమకేశులయినను- నామదిత్రాస- బాపుముహరి సమసితవ్యాస సంయమిహృత్సీమనివాస- దయాగుణాగారసుచిద్విలాస-మతిడహాస- హేమవాస- సుదాస= స్తోమపాలకామజనకయికనను ప్రేమసేలుకామితార్థమొసగియు ॥శ్రీరామ॥

వందనంబుయిడుగోసేతు- వాస్పగగైకొనుము- మంద మామెనామతివిచారింపగ- సందేహములుచీవరా. సుందరకరణ- నామదికిటు బా

పవితరణ- సురనరగణవందితచరణ- ఆయతభవవారధితరణ= మందరధర యిందుకాతిజిందజేయునీముఖమందహాసమిందుజూపుశ్రీహరి- నమ్మనిపట్టి. నీపాదద్వంద్వముబట్టి పునర్భవమొందరుపుట్టి- నిశ్శ్రేయసమొందుమ రిట్టి- మార్గముకందుజూపుమీశ- భవవినాశ- స్వప్రకాశ- స్తవేశ= పురంద రాదవందనీయసందడినాగ దాసడెందమందు పుందువంచువిందును ॥ రామామణి ॥

గురుస్తోత్రోపేత శ్రీభగవద్గుణకీర్తనలు.

మధ్యమావతిరాగం - అటతాళం-

నినునమ్మినార- సీతారామ- ననుబ్రోవవేరా॥ నినునమ్మినారయోనీర జదళనేత్రజనకజాహృచ్ఛోరసెనరునాపైలేదా- ఇనకులంబునజనన మొంది యుదనుజనమజునిమనవిచేకొనిఘనముగా దశకంఠునుర్విలోదుని మిమునుల నుమనుమనినహరి ॥నను॥ పుండరీకాక్ష- నీయందునాకుంచునాపేక్ష- భక్త లపయినఖండమౌదీక్ష- పుంచకునుర్గకంధిజవక్ష॥ నిండువేడుకతోనీయండగా రుచునుంటి- చండి- తనముమాన్పిచేపట్టవయితివి- ఖండనంబునఖండదనుజు లదండధరువలెచండియును మాతాండుభాతిని వెలుగుచుండెడియండజా వాహనశౌరి ॥నిను॥ మేదినీకరుణా- లేడటరనామీదభవతరణా- నాతోనీ కువాదశ్రీరమణా- అజముఖవాసవార్చితచరణా॥ మేదినిలోమున్నా వేద వాదులశుద్ధ- సాధులబ్రోచినసర్వాత్మ వనివింటి- బీదవాడనినీదుకృప నామీ దరాదికనేమిశేయుదు వేదగోచరయోదయానిధి భేదమోదవిరహితశ్రీహరి॥ నిను॥ సరసిజనేత్ర- అచ్యుతధారాధరనీలగాత్ర- కరుణించారహరిహయ స్తోత్ర- చలమేలరపురవయిరిమిత్ర॥ నరకంఠీరవరూపశరణన్నకరుణించె- బి రుదుగలిగినదనినీశరణుజొచ్చితినయ్యా- కరికరియు-హరిహరియు గిరిగిరి-శ రధిశరధియుదాకుకరణిని సురరిపునిథరలో నడాకియు- కరనఖంబులగూల్చి

ట్యముమతిచెడికోరకనూ - సతతంబును శ్రీహరిచరణంబులెగతియనినమ్మకొని. పతితాత్ములసంగతినిరతముదుర్గతికాలయమనినుణిదలపోసియు॥ హరిదా॥ మదిలోపలబహ్వమదమెగలెట్టియుమందినిజూచినను- ముదమునదూషింపుచునుండెదవిది మోసమునుమిజీవా- యదభూతదయాస్పదమానస్లుగకుదురుజేసియాపదలనుబాసియు॥ హరిదా॥ సత్యముకన్ననుపుణ్యముమిక్కిలిసరిన్నైనదిలేదు - సత్యమువిడుచుటకన్ననుపాపముజగమునగనరాదు - నిత్యముదేహమనిత్యంబనితత్సత్యవాక్యమునుసతతమునిలిపియు॥ హరిదా॥ సకలంబును శ్రీహరిమయమనునుసన్నుతింపవలెనూ - వికలంబునుబొందకదుర్గుణములవిడిచినిలిచిమీద - శుకశౌనకమౌనికదంబముమేమికనంగోరిపోనచెకనగోరుచు॥ హరిదా॥ అసమానునివెంకటరామయగురువాత్మయందునిలిపీ - మసలకసందడినాగదాసహృత్పద్మమిదనితెలిశి - పసికాత్ములనేచెనజూచినదేవసముంటనిదుర్వ్యసనముడిగి శ్రీ॥ హరిదాసులకును॥  ౨౨

జంఝూటిరాగం - ఆదితాళం,

యేమిశేతుయేమనందునే - నోమనసనిన్నుయెటులనిల్పిహరినిగందునే - యేమిశేతుయేమనందు తామరససమాననేత్రుని నామముగొనియాడుమంటె=తామసమునసీమమువిడిరామలపైప్రేమముంచెదు॥ యేమి॥ మందమతినిముందుగానక - హరిదాసులనునిందజేసితివేమెరూనక - యిందిరావమణునివేడినందునకైవల్యమనుచు. సందియంబుమానిచెప్పిన=అందముగనుపందలతోపొందిడజననియందునుగదె॥ యేమి॥ పంతమేలవినవెచెప్పెదా - నీచేతజూచి- మంతనమునమమణమిప్పెద - అంతరంగమునసులక్ష్మికాంతునిచింతింపకున్న అంతమునకృతాంతుభటులు=యింతింతగద్రుంతురుగదె - సంతతమునుస్వాంతమవినుు॥ యేమి॥ ఘూరియాశచేతజిక్కక- వెంకట రామధీరునిశేవించేనిక్కక- నేరమెంచకనాగదాసునారసిపోషించుశ్రీహరి- జేరిసన్నుతిజేయుమన్న=దారుణముగుశూర్ధునివలెపోవుటకైకోరెదలిక॥ యేమిశేతు॥

యమునాకళ్యాణిరాగం - ఆదితాళం,

అపరాధినినను- నెపమెన్నక- నీ- కృపజూడరశౌరీ ॥ చపలాత్ముడనని నెపమెన్నినసీకపరాధంబగునపరిమితంబుగ॥అప॥కరణత్రయమేకముజేసియు నీచరణములేమదిజేర్చినిలిపితిని- ఘరుడాధ్యుడనను పాలించరనీ- శరణుజొచ్చి తినిదురితదూరహరి॥ అప॥ అతిపాపాత్ముడమతిహీనుడనని - ధృతిచే నేనొక హితవూహించియు- నతిజేసితిశ్రీపతినిజముగనీమతియెట్టిదొనాగతియెట్టిదొ గద॥ అప॥ శృతివాక్యంబునునతజనరక్షణ- రతమైననుననుబ్రోవు - క్షితిలో నాశృతినతరక్షణమానృతమైననునాస్థితినీకెందుకు॥ అప॥ నానారూపులనా ధనసుచునినను - నమ్మినాను దేవా - దీనావననీమానసమెట్టిదో - కానలేను నేక రుణావనధీ॥ అప॥ అయినా వెంకటరామగురుడవై యవతరించిభువిని- నయ ముగ వాసుని నేలితివని నేభయముపీడితినిజయజయమాధవ॥ అప॥ పరమపురు ష విందము రారి- సరసిజనిభనేత్రా- నరసఖసందడినాగదాసనుతకరుణిం చరేమరుగుజొచ్చితిని॥ అపరాధి॥ ౨౪

శంకరాభరణరాగం - రూపకతాళము,

మనసా పాపపుణ్యమార్గములే దెలిపేద- వినవె బాగా- ముందు- గ నకచేసితిరి గేటిజనులసుఖమశిఖములుగనవెవేగ॥ సగుణభావము చేత నెగడుచు నుండినసాలోకముగల్గునూ- లేక- సొగసైనస్త్రీలపైదగిలినచిత్తముతునకజ న్మమువచ్చునూ॥ మనసా॥ గోత్రప్రవర్తననగుణముగల్గినవేగ గోలోకము నకేగునూ- లేక ధాత్రిలోపరులపైతగద్వేషముండినపందశూకంబగునూ ॥ మన॥ సాధుత్వమున యజ్ఞసరణి దెలిసియు జేయుస్వర్గలోకముగలుగునూ లేక॥ కోర్ధాత్ముడయియున్న కుంభినిలోపాల కుక్కుటమైపుట్టుసూ॥మన॥ మరాత్ముడుగాక భక్తిగలిగియుండె బ్రంహలోకముగలుగునూ- లేక - కామలోలుడునై కమఠపరుడై యున్నగలుగు మార్జాలముగనూ ॥మన॥ సదమలుండైనిష్ఠనలిపితపోలోక సంపదబునుబొందునూ- లేక-మదిలోనమో హంబుమానకయుండిన మండూకమైపుట్టునూ ॥మన॥ రాగీవిరక్తిమదిలో

నూదియున్నసారూప్యంబుతగ గలుగునూ లేక • గాఢంబుగనుమదముగలిగి
యుండినను సూకరమునైజనియించునూ ॥మన॥ సరసస్సద్గురుబోధ సరణి
గుర్తెరిగినసామీప్యముబొందునూ- లేక - పరమలోభగుణముపట్టుబడ్డట్టయి
తెమల్చీకమైపుట్టునూ॥మన॥ సురుచిరంబుగచిత్తశుద్ధిమహాలోకసుఖములనొం
దించునూ - లేక - పరులాకుతనము;ఖఫలమురాగోరీనప్లవగంబునైపుట్టును॥
మన॥ వైరాగ్యమునుగల్గిపర్తిల్లుచుండినను వైకుంఠపదమొందునూ - లేక -
వైరణంబెడిచిమాత్సర్యయుక్తుండైనజంబుకంబై పుట్టును॥ మన॥ కరముసుజ్ఞా
నంబుగలిగిప్రకాశింపకైలాసపదమబ్బునూ- లేక- సరియవరునాతోయీజగ
ములోననియున్నసాళువనైపుట్టునూ॥ మన ॥ సదయుడై వేదాంతశాస్త్రంబె
రింగినజన్మరహితంబగునూ- లేక - మదినిదంభముగల్గిమసలుచునుండేనుమ
హిషమైధరబుట్టునూ ॥ మన ॥ అరయవెంకటరామగురునిశేవించీనపరమేశ్వ
రుండగునూ- లేక- పరులకుసుఖమురావలదనితలచినవ్యాఘ్రజన్మంబెత్తునూ॥
మన ॥ ధరనుసందడినాగదాసపోషకులేడవరనిత్యత్వముగల్గునూ- లేక- పర
మహాంకారసంభరితుడైయున్నసంభవమొందుదాసురుడగుచునూ॥ మనసా॥

శంకరాభరణం - అటతాళం.

శ్రీనాధనీపాదచింతజేయుచునుంటిదానవారీ-నన్ను- మానుగరక్షిం
చుమన్నఘజనకాసమానశౌర్య॥ శ్రీనాధ ॥ కోమలంబైననీమోముజూపరశ్రీ
రామనామ- ఫుల్లతామరసాక్షపితామహావందితపాదసరోజా॥ శ్రీనాధ॥ సం
తమేలరనాభోభక్తిసందోహహృత్పద్మ వాససుజనాంతకనీవునాస్వాంతం
బునందుండుదంశైత్రాణ॥ శ్రీనాధ॥ శుభ్రాంశువదననీసుందరమునుమాకుజూ
పవేమీ- మేచకాభ్రసంహాననన్నాదరింపుముదేనార్చితాంఘ్రి॥ శ్రీనాధ॥
భవరుగ్భేషజమందప్రాజ్ఞుడననినన్నుపరిహారింప- నాధునివహాభీష్టతనీకునీతి
గాదిదియీయవనిలోనా॥ శ్రీనాధ॥ నానారూపంబులానాధననుచునిన్నునం
మినారా- అన్యమానవశ్రేణీనిమదినైనదలువనిమతమునాది ॥ శ్రీనాధ॥ అర
విందోదరనారదాదిమానీంద్రహృత్సరశిజాళీఘోర - దురితంబులనుబాసిర

తంబున న్నేలుసిరిస్వీకార॥ శ్రీనాథ॥ అరయ వెంకటరామగురుడవై జనియించివి రివిగను- దాసవరుల నేలితివి యీధరలో సందడి నాగదాసపోషా॥ శ్రీనాథ॥



## తత్వజ్ఞానోచిత భగవద్గుణకీర్తనలు,

(*) —

శుద్ధసావేరి రాగము అట తాళము:

వాయునందన రామ వసుధాధిపు నిజను బవర్ణింపనలవిగాదూ- అంత్య మును లేదు- కాయబుద్ధీంద్రియగుణాముల నెయడను తానంటకనుండి ర్మాయుడై వెలుగు చున్న ముక్తి దాయకుండైనాతనుజూడ॥ వాయు॥ లోకత్రయంబు తనలో సంచరించగను- నేకాకిన్మైయున్నదూ- యేమియు గాదు- రాకపోకలు లేక నిరతంబాకులత జందకను తాన స్తోకప్రకృతియు లేకయుండైన నేకజంతుపులం దుతానై॥ వాయు॥ రావణాసురుడాది రాక్షసేంద్రుల నెల్లరయమున వెదకిపట్టి- రణమునను గొట్టి - కోవిదులు నుతియింప వేగమే దేవదేవుడ యోధ్య చేరుట కేవలమునా చేతనైనది భావరహితు డీతగాముడనగను॥ వాయు॥ కామాత్ముతై నయీ భూమిలో జనులాత్మారాముని దెలియలేకా- ధీయుతులు గాక - తామ సంబున బుట్టిచచ్చుచు నీమహీని వర్తించువారల కేమిదుఃఖంబందునెన్నను తామరసగర్భునకు శక్యమె ॥ వాయు ॥ యోగీంద్రహృదయనివాసుడై సంతతము త్యాగిన్మైయున్నవాడూ - బాగుగను జూడు - రాగరహితుండైన వెంకటరామగురువరు నెప్పుడు మెదలో బాగుగా నుతియించు సందడే - నాగదాసుని బ్రోతున సేవిను॥ వాయునందన॥ ౨౭

## సీసార్థ దర్వ్యాలు.

శ్రీరామచంద్ర దయాశ్రితజనమందార కరుణాపయోనిధి పరమపురుష। నీదివ్యతత్వంబు నేనపేక్షించితి బోధించు మాత్మ యంభోరుహాక్ష। అనవిని రాముడత్యానందమును బొంది మారుతాత్మజ లోకమంగళంబు। నైనట్టి విద్య నీవడిగితివది గాన- వినుపించెద సువినుమూ- యీబోధ నీదు- మనసున నుంచుకొనుమూ॥

అనుమానముంచకనీవడిగినమార్గ వే-దన లేకుండియుసా-ధనమైనసభోధన
మయ్యేటటు. వినుపించెదనువినుమా॥ యీబోధననీమనసున నుంచుకొ
నుము॥౧॥ కాలత్రయములదుస్త్ర-గుణసత్వ-గుణలవాసత్రయపంచకోశను
లను స్థూలంబుసూక్ష్మంబుసుస్థిరకారణంబను దేహత్రితయంబులందునెపు
డు- యేబాధలేక నేనేకరూపుడనయ్యునిత్యమానందాంబునిధిమునింగి - సక
లచేతనకమణసముదాయములనెల్ల సాక్షినైచూచుచుందును- చూచేటివాని.
సన్నిధియందేవుందును॥ శిక్షింపఖలులనెలాపేక్షింపసౌఖ్యాధికము-రక్షిం
పసభ్యులను నే- నక్షరతత్వంబైసర్వంబును-సాక్షినైచూచుచుందునూ-చూచే
టివాని సన్నిధియందేవుందునూ-౨॥ రజ్జుసర్పమురుక్తిరజితంబురీతిగా- గ
నుపించుభ్రమచేతకన్నుచెదిరి ఆరూపులన్నియుభావమైశేషించు తాత్రిదుము
త్యవుచిప్పతరిచిమాడ- నావిధంబునలోకమంతయునాయందుదోచుమాడు
సుకదుతో౽ముగను- విజ్ఞానదృష్టిచేవీక్షింపనేమియు - గనుపింపకుందునిత్యా
మూ- ఆత్మస్వరూపే-గనుపింపుచుందుసత్యమూ॥ పసిబూనినిన్ను నీవిప్పగిది
భావింపుచున్నననుజేరగలుగుమీద-ఘనమాయెనుజేసినమానసమిటు. గను
పింపకుందునిత్యమూ-ఆత్మస్వరూపే-గనుపింపుచుందుసత్యమూ॥౩ అంజనీ
వరసుతాహంబ్రంహామని వెడిశ్రుతిప్రమాణంబునశోధజేసి- దేహమందున
నిన్నుదెలిసిసుఖింపుముపంచభూతవికారభావములును- నిన్నెన్నటికినంటవ
న్నీటియందునీవుండుటసిద్ధమఖండమూతిణ- అనుదినంబీయోగమభ్యాసము
నుజేయు॥ స్థిరమైనసుఖముగలుగునూ-చిత్తాదివికృతులరయాగనద్వైతోల్గును-
పర మమైనట్టిమోక్షపదముజెందెదవుయీసరణిమీరకనుసాధు, వర బోధ
రసంబరసిగ్రహించుము-స్థిరమైనసుఖముగలుగునూ- చిత్తాదివికృతులరయా
గనద్వైతోలుగునూ-౪॥ భవ్యచరిత్రయూపరమరహస్యంబు దెలియకజ్ఞానాం
ధతిమిరముననూ- జొచ్చిసుపథమునుశోధింపగాలేక జననంబుమరణంబుజెం
దుచుందురు- వారిలట్టుండవిద్వాంసులమనిచాలగర్వించిమోక్షంబుగానలేక.
శాస్త్రవాదనలచేచెడుదురుకొందరు॥ మోహామెంచుచునుందురు - గుడు

సేవజేసి- సాధులైయిలనుకొందరూ॥వేదాంతవేదియయిన వెంకటరామా
హ్వాగురునీబోధాచేనాగాహ్వాయకవి వాదించినయీవరకృతివిన్నను॥ మో
దమొందుచునుందురూ-గురుసేవజేసి-సాధులయియిలనుకొందరూ॥౫ ౨౬

అసావేరి రాగం-ఆటతాళం-

అన్యాయ్యోజనులారా అన్యాయముగను-జన్మాబ్ధిలోమునిగెదరూ॥ద
య్యానను జరిజేరేమార్గము వెయ్యివిధముల దెల్పగలిగిన-యయ్యలకుశుశ్రూ
షజెయ్యనునియ్యకొనకనుకయ్యమూనెదరయ్యా॥భక్తశ్రేష్టులమీవి భక్తిము
క్తికిమూల-యుక్త్యాని తెలియలేకా-భక్తులనుదూషింపుచును పెకయుక్తులకు
బహుశక్తిగలిగియు-ముక్తిబొందెదమనుచుతమలో;మురయుచునుందురునిర
యమొందను॥అయ్యా॥చలనమొందుచునినునిశ్చలమయినయాత్మానుగలసేదా
రెరుగలేకా-కలలోగనుగొనువస్తువులుమేలట-నినపింమట మేధ్యయా॥ సటు
వలెను సర్వప్రపంచమునుచంచలమటంచును దెలియరాదా॥అయ్యా॥అనిశమి
ద్ధరమశుభవనధీలోమునుగుచు-జననమొందుచునీల్గుచూ-చనటులైసుఖమనేటి
వస్తువుగనుగొనగజాలకనుమీరిల-ననుభవించెడిదుఃఖమేసుఖమని తలంతురు
వెఱ్ఱిలగుచును॥అయ్యా॥ దాసజనులపొందువాసిమీరగముక్తిదారిదెల్పునటం
చునూ-దేశికులువచియింపుచుందురిదేప్రకారముగానునిరతము- దాససంగ
మువానిదుర్జనవాసములుపలుమారుజేరెద-రయ్యయ్యో॥ ఘోరమయిన
ట్టిసంసారారణ్యంబులో-దూరిపూర్వమువచ్చిన- దారిగానకమేరమీరియు.
జారచోరతనంబునకుబ- ద్ధిరులయివతిరంచెదరుమీదెరుగలేకను మూఢమ
తులయి॥అయ్యా॥యిష్టదైవమునందుదృష్టినిల్పియుదేహ-చేష్టలన్నియు మర
చియు-స్పష్టముగసుఖియింపలేకనుభ్రష్టమానసులయితిరిక మీకష్టములుగ
ణుతింపగనుపరమేష్టికయినచుశక్యమానా॥అయ్యా॥ ప్రేమవెంకటరామస్వా
మిపాదద్వంద్వతామరసములుగొలిచీ-యీమహానిదాలిశకదంబము క్షేమ
మునకయికయితవముహృత్సీమజేరగనీకముదముజెప్పెసందడినాగదాసిటు-
అన్యాయ్యోజనులారా॥ ౨౭

శుద్ధసావేరిరాగం-అటతాళం

పరతత్వమెరిగిన ప్రాజ్ఞులీసందేహమరసి తెలుపుడి వేగమే - నిరతము సుగుణనామరూపమనీ- వేమియు లేనియాత్మను మెరుగనగు ననియందు రికొం దరచెట్లగోచరమౌనుద్భవమనగ ॥పర॥ సచ్చిదానందాత్మాపావ యపుడన లోకమచ్చుగనుండవలయూ- తుచ్ఛమయి చనుగాననట్లనపోచదందున నిర యపుడనవచ్చు దోషము శూన్యమనియు నవశ్యముగనిక నెట్టివనవలె ॥పర॥ జీవుడారయకమణా జేయుచున్నను నిద్రబోవు వేళ్ళ చుకమణాలూ- లేవు గావున మణాడనదగదీవ పేవని జేయుచున్నను- జీవహీనంబైన దేహము జేయవలయున మిస్తకమణాలు ॥పర॥ ఖండమాత్మ యియున్న గలుగు దోషము కృతులాఖండమా త్మనియనుటచే- నిండిసకలజనంబులాత్మ యఖండమయి వెలుగనినగను పదమి మనంతటనహామటంచును వొప్పగను చిత్సుఖమునైతా ॥పర॥ మానుగాను తీర్థస్నానమాత్మునకన- యనూననిర్మలుడు దేహి- గాన దేహంబున కటు న్నను గల్గుదోషము నిత్యదేహమనూనమలిన యుతంబునగుచును గాన బడుచు న్నదియు గావున ॥పర॥ అరయ వెంకటరామగురుని గొల్చెటిసూరి - వరులు దక్క గనన్యులూ- యెరుగ శక్యము గాదు శాస్త్రము లెన్ని జదివినవారలయిన ను- ధరనుసందడి నాగవాసహృదాబ్జసంస్థితమయినగోప్యము ॥ పరతత్వ మెరిగి ప్రాజ్ఞులీసందేహమరసి దెల్పుడి వేగమే॥ ౩౦

పంతువరాళిరాగం - అటతాళం-

ఇదుగో పరతత్వమూ వోజనులార- ఇదుగో పరతత్వమూ ॥ యిదు గో పరతత్వమరమర లేకాను సురుచిరంబైలోకభరితమయియున్నాది ॥ఇ॥ ఈషణాదిత్రయమునూ- విడిచియుబూడు- డీష్యాణసూయలతోడనూ- భాసి ల్లుచున్నాది బ్రహ్మామంతట నిండి - దేశకాలంబ్రములచే నుపదేశ మయిన నుదెలుసు, ఇదు, సకలభూతములందునూ- వొకరీతిగా- సార్వకాలములం దునూ- అకలంకమయి సాక్షియై వెలుగుచున్నాది- వికలచిత్తులుగాక వేదక్ర తోజూడుడీ, ఇదు, యెరుకమరుపులు లేకనూ నిత్యముగుత స్వర్గమెరుగ

తున్నదూ కొరుకయినలోకములనే సాధనలేక- నెరుగుచున్నాది పరమా
నందముతోడ, ఇది, అంశలయిదునుగూడినా- లోకమునందు నంస్సర్వ్యాయ
మువీడినా. సంశయంబును లేక సర్వంబు తానయ్యె భ్రాంశవిహీనమయి ప్రబలు
చున్నాది, ఇది, అరయ వెంకటరామయా- గురుగన జాల- నట్టివారికి దు
ర్వ్యయా- ధరనుసందడినాగదాసరథకుడగు శ్రీహరి స్వస్వరూపంబు పరమయ్యె
యున్నాది, ఇదుగో పరతత్వమూ, ౩౧.

కాంభోదిరాగం - అటతాళం-

త్యాగియై తెనేమీ- తా- రాగియై తెనేమీ- ఆగమో క్తంబుగను స
చ్చిదాత్మనుగనుగొన్నవాడు, త్యాగి, రాత్రిపగలనకనొకరీతిగా వెలిగేటి
యాపోజ్యోతియందుమానసంబుజొకజేసియుండువాడు, త్యాగి, కామ
లోభముఖశత్రుఖండనా జేసియుసీత్య। ధూమరహితానలసిఖలతులనూగుచు
నుండేటివాడు, త్యాగి, సత్తుచిత్తానందములనూచకగాగన్గొనియు. చి
త్తవృత్తిశూన్యుడై వెలుగుచుండుపండితుండుమిగుల, త్యాగి, శ్రోత్రత్వ గ్జి
హ్వఘ్రాణనేత్రయింద్రియముచేత రాత్రి పగలుబొందువిషయరాజిబ్రహ్మం
బునేచువాడు, త్యాగి, బాగుగా వెంకటరామ యోగినిగొనియాడుసందడినా
గదాసు నేలుచిదానందునీ సేవించువాడు; త్యాగి, ౩౨.

వరాళిరాగం- అటతాళం-

ఆత్మానాత్మను దెలియవలెరా- నిత్యాము దేహాత్మబుద్ధియువీడవలెరా,
ఆత్మానాత్మల దెలసియునవరతంబు పరమాత్మ నేననినిరుపమానంద మయుడు
నలు, ఆత్మా, గర్వరహితుడును గావలెరా- బ్రహ్మానందకాంక్షగలిగి యుం
డవలెరా- సర్వలోకములకును సాక్షియై వెలిగేటి- నిర్వాణపదమొందనెంచు
వారు. ఆత్మా, అరిషడ్వర్గము గెల్వవలెరా. నిత్యానందభరిత హృ
దయులును గావలెరా-అరయగ సచరాచరాత్మలు నిండిన-పరమాత్మగనునట్టి
భ్రాంతిగలిగినవారు ॥ఆత్మా॥ గురుకారుణ్యము బొందవలెరా-యూషణ్యాదది
ద గుణములన్నియువీడవలెరా- సురుచిరంబయి సచిత్సుఖరూపముద

నదుపరిపూర్ణతత్వసంపదగోరువారెల్లా ॥ఆత్మా॥ దురితకర్మములు వీడవ
లెరా- వెంకటరామ- గురునిసన్నుతిజేయవలెరా- ధరనుసందడినాశదాస
పోషకుడయిన- హరిరూపుగనగోరునరులంతకడువేగ ॥ ఆత్మానాత్మలదెలి
యవలెరా॥ ౩౩

కేదారిగౌళరాగం- అటతాళం.

జన్మమెత్తగనేమిఫలమూ . హరిని ధ్యానింపనేర్నియీమనసు వికల
మూ ॥జన్మ॥ జన్మమెత్తినవుడె జలజాక్షుబొగడకను- మన్మథతాపమునచి
న్మయునిగనలేని॥జన్మ॥కామక్రోధములచేతనూ- పట్టి-పామరత్వమునుపైబె
ట్టుకొనుచునూ నీమంబువిడితమక్షేమంబేకోరూచూ- తామసపూర్ణమయిన
తత్వంబుగనలేని ॥జన్మ॥ సతతంబుమాయచేజిక్కి- అధికవెతలబొందుచుదు
రితవనధిలోజొక్కి- రతిపతిజనకునిమతినిగొలిచి సద్గతిగానలేక యీక్షితి
లోనమనుజులయి, జన్మ, యీషణత్రయములద్రుంచి. భక్తపోషాదు నెప్పు
డుమదిలోనసుంచి- పాషాండమతములబారబోలియలోక- దూషణమాని
సంతోషులుగానట్టి,జ,ఆశపాశములనుద్రుంచి యిహవాసానవిడిచిదుర్గు
ణములమించి- వాసిగానుభక్తపోషకుడయినట్టి- దేశికనాధుని దెలియనేరని
దుష్ట. జన్మ, ఇనచంద్రహంసలలయమూ- గను- గొనిబుధ్యకడగనియబ్ర
హ్మము- పన్నిబూని శేవించిపిదపకయివల్యాముగన నేరనిదుష్ట మనుజులయి
యూర్విలో, జన్మ, పరతత్వమెరుగజాలకనూ। సకలబాధసంయుతమయిన
వపుమేలనుచునూ- ధరనువెంకటరామగురుసస్వరూపంబు- మెరుగజాలక
సాధునరువమారెడిఘోర, జ, ౩౪

నాథనామక్రియరాగం- ఆదితాళం-

చరాచరంబులపరిపూర్ణంబైచదరకయుండెదదేకదా ; గురుకృపగలి
గినగుణవంతులునిర్గుణమని తెలిశినదదేకదా॥ చరాచరం॥ జగదుత్పత్తిస్థితి
కారణమైచలగుచునుండెదదేకదా. నిగమవేద్యమయి కుటిలులకందకనిలచి
యున్నదల్లదేకదా॥చరాచ॥విష్ణుబ్రంహరుద్రాదులకవ్వలవెలుగుచునుండేద

దేకదా-కృష్ణరక్తపీతాదిరూపములుకొంచమయినలేందదేకదా॥చరా॥అం
గత్రయమునకాధారంబయియలరుచునుండేదదేకదా. శృంగాటకమునబా
దగదోచిశుద్ధవస్తువల్లదేకదా॥చరా॥భూతభవిష్యద్వర్తమానముల ఛేకల
నెరిగెదదేకదా-రాతిరిపగలనకొకట-రీతిపరంజ్యోతైవెలిగెదదేకదా॥చరా॥
ధావాతీతంబనిబుధవర్యులుబలుకుచునుండేదదేకదా-జీవాత్మకు పరమయిద
నరెడుసచ్చిదానందమల్లదేకదా॥చరా.భయవినాశముల నంటకనెప్పుడుభ
వములనొందనిదదేకదా-బయలులోపలనుబట్టబయలునయి ప్రకాశమొందదె
దదేకదా-చరా॥చెప్పగంకట రామదేశికుడుమేలనితెల్పినదదెకదా- గో
ప్యసందతినాగదాసహృద్గోచరమయినదిఅదెకదా॥ చరాచరంబులపరిపూ
ర్ణులై॥ ౩౫

జంఝూటిరాగ; ఆదితాళం

మెరుగవలెనుతననూ-నిజముగ-గురువరేణ్యుదయానూ- మెరుగవలె
నుదృహిణేంద్రాదులకునుస్థిరముగకారణపురుషుడనేనని॥మె- పంచభూత
ములనూ-మరియును-పంచకోశములునూ-పంచక్లేశములు పంచేంద్రియము
లు-పంచవిషయములుప్రాణముగానని॥ మెరుగు. సకలవస్తువులనూ నిండి
యు-సకలదేశములనూ-వాకరూపుననేనకలంకుడనయివికలములేకను వెలు
గుచుందునని-మెరు॥నామరూపములునూ-గుణములు కామమోహములును
షేమదుర్దశలువేమరువెదకినమేమాత్రమునాకివిలేవనుచునూ॥మెరు- తా
న్నికల్పములునూ-మేగిన-నేకరూపముననూ-యున్నవాడగావున సదాశివు
డమిన్నుమన్ను నేనైన్నదుగానని॥మెరు-సాధనమేమియునూ-లేకను- సకలవ
స్తువులునూ-యీధరణినినేనెరుగుదుగావునబోధరూపుడను ముఖ్యగములనని
మెరు॥నిరుపాధికమయ్యు మరియును నిరుపమానమయ్యూ- అరయగనిత్యం
బునసుఖమునాకిరువుగాను నేపరమసుఖుడనని॥మెరు-పాపపుణ్యములునూ
ఫలసం-పదవికారములునూ కోపలోభములు శోకకాళసూయలు- తాపా
దులునాదావునలేవని॥మెరు-యిదిమెప్పూర్ణబోధా-దీనికి- వేమిలేదుదా

ధా సదములు వైయాసరణి మెరింగినసుదతిపురుషులకు సుఖముగలుగునని॥
చెరు-రాగరహితుడయిన-వెంకటరామగురునికరుణా-బాగుగసందడినాగ
దాసయీ-యోగజన్యమగుభోగమొందెననీ॥చెరు॥ ౩౬

సావేరిరాగం - అటతాళం,

జ్యోతినిగనరా-తన్మయుడవై-ప్రీతిచేకొనరా॥ జ్యోతినిగనరానిధూ-
తకల్మషుడవై - రాతిరిపగలొకరీతివెలిగపరం॥ జ్యో॥ భూరికాంతులనూ-
చక్రములారు-మీరిమీదటనూ- చారుసహస్రారచక్రమందుననిత్య-తారకాకా
రమైతళతళమెరిసేటి॥ జ్యోతి॥ హితవుగయమునా-గంగాసర- స్వతులమధ్య
మునా - ప్రతిలేనిరవిచంద్రపావకప్రభలసంహతిరీతివెలిగేటియాపుత్ర్యాష్టం
బైన॥ జ్యో॥ అరయగనీలా-తోయదమధ్యమందునచాలా-బిరబిరమెరిసేటిమె
రుపులవిధమున - మెఱయుచున్నట్టిశ్రీకరమైనయా పరం॥ జ్యో॥ వాటంబుగా
నూ యల్లవుడు-స్వం-గాటకంబుననూ-కోటిసూర్యులమఱియు కోటిచంద్రుల
కోటి-మేటివిద్యుల్లతలమించివెలిగేటియాపో॥ జ్యో॥ వరయోగమిదియూ-
యింతకులేదు- పరమమైనదియూ- అరయవెంకటరామాహ్వయదేశికేంద్రు
డీ ధరణిసందడినాగదాసుకుజెప్పిన॥ జ్యోతి॥ ౩౭

నాటరాగం ఆదితాళం,

దేవదేవనీస్వరూపుదెలియుశక్యామా- నిఖిల - భావనాతీతంబునై స
ద్రూపమై వెలుగొందుచున్న॥ దేవ॥ ఆదిమధ్యాంతములులేకనలరుచుండి
యూ యంతో మోదమూతో సకలలోకములునునిండియఖండమైన॥ దేవ॥ అ
వ్యయానందగోవిందా-అచ్యుతానంతా-పరమాదివ్యతత్వమై నిర్వాణభవ్య
మూర్తివై వెలుంగు॥ దేవ॥ సర్వవస్తువులనునిండిసాక్షివైయుండి మరియు స
ర్వమునంటకనాకాశ-సౌజ్ఞ గావర్తింపుచున్న॥ దేవ॥ కులముగోత్రములును
లేకగోప్యరూపమునాయుండి చలనమేమిలేకలోకములకుకారణభూతమైన॥
దేవ॥ జీవశివభేదమునులేక శ్రేయోరూపమై-సకల జీవాధారమైనవికారచేష్ట
లేమిలేకయున్న॥ దేవ॥ పంచతత్వములకువేఱైప్రజ్ఞ దీపింపగనుండి- సంచి

తాదికమీ-లేకసచ్చిదానందంబునైన॥ దేవ॥ బాగుగావెంకటరామార్యభా
ఆచెన్నొందిం - సందడినాగదాసోపాస్యమైయమనసకు-మైవెలుగొందుచున్న॥
దేవదేవ॥ ౩౮

సౌరాష్ట్రరాగం - ఆదితాళము.

నాలుగుత్రోవలనట్టనడుమజూడగా- బ్రహ్మం-తాలిమీతోవెలుగుచున్న
దితన్నైకెలోనె॥ నాలు॥ రూపురేఖలేకయెవ్వరుడుపమురీతి- కను- పాపలకును
జూపైయాత్మాకారాపైయున్నది॥ నాలు॥ కొండమీదయంతోపరమగోప్యము
గానూ- ఆత్మ -నిండుకాంతిచేతదనరుచుండునెప్పుడూ॥ నాలు॥ పంచువెన్నె
లరీతిగనూతారాండచంద్ర-వహ్ని-మండలంబులమధ్యదోచుమానుగాను॥ నా
లు॥ రాత్రిపగలనకనొకరీతిగాను-అపో-జ్యోతైవెలుగుచున్నదెంతోటోద్య
ముగాను॥ నాలు॥ అదియెబ్రంహవిష్ణురుద్రాద్యమరులెల్ల-నల్లదియె-పర
మాత్మస్వరూపమరశిచూడగా॥ నాలు॥ సచ్చిదానందాత్మతత్వసంజ్ఞయది
యేనూ-జగమా-నిత్యమనికనుగొన్నబుధులకునిలకడైనదీ॥ నాలు॥ సకలనూ
తహృదయసరసీజములయందూ- యుస్వ డకలంకామయిస్వప్రకాశతనలరు
చుండు॥ నాలు॥ బాగుగవెంకటరామయోగికరుణాచే- సందడి- నాగదాస
హృదయమునకానందమయినదీ॥ నాలుగు॥ ౩౯

శుద్ధసావేరిరాగం- అటతాళం,

ఇదుగోపరమాత్మస్వరూపంబెన్నలవిగానిదీ - అదియునిదియనరా
కలోకంబంతనిండియున్నదీ॥ ఇదుగో॥ మనసులేనిదిమనసుగానిదిమనసుకదగ
నరానిదీ-మనసులయేమయియున్నచోటనెమంజులంబైయున్నది॥ ఇదుగో॥
చూపులకుగనరానిదిగురుసూత్రముకులోనైనదీ-చూపుజూడకచూచువారికిసు
లభముగనేయున్నదీ॥ ఇదు॥ యెరుగనేమియుయెరుగబడదదియెవ్వరీచేభూ
మిలో-యెరుకవిడిచియుచూడనేర్చినయెరుకతానైయున్నదీ॥ ఇదు॥ రూపురే
ఖలులేనిది- బహురూపరేఖలలోనిది- రూపుచూపొకటైనచిత్సుఖరూపమయి
వెలుగొందదీ॥ ఇదు॥ పంచఅంశలగూడుకొనియుప్రపంచరూపకమయునదీ-

పంచఅంశలలోన రెంటినిబాసితె బ్రహ్మంబదీ ||ఇదు|| అవయవంబులులేనిది నిరవయంబునుగానిది | అవయవంబులలోనవిపంక్తై వెలుగుచున్నదీ || ఇదు || కర్తగాదదిభోక్తగాదదికర్మమేమియులేనిది | కర్తభోక్తులునైనజీవులకర్మ కాధారంబదీ || ఇదు || యంతవారికిదెలియబడదదియెన్నివిధములజూచినా| సంతతముగురుసేవచేసెటిసజ్జనులవశమైనదీ||ఇదు [illegible]ట్టుదెలియని మూఢుల కెల్లనువట్టిదేయనదగినదీ | గట్టుదెలిసినసుజనులకు బట్టబయలై యున్నదీ ||ఇదు||మతములందునముక్తిగలదని మనుజులకుగనరానిది| మతము[illegible]డిసమ్మతులునైనసుమతులకునునెళవైనది ||ఇదు|| అరయవెంకటరామగురుగనవట్టివారికిదవ్వుదీ|ధరనుసందడవాగ దాసహృత్పాద్మసంస్థితమైనదీ||ఇదు|| ||౩౫||

యాల పాట.

దేహమూనేననుచూనాత్మా | దెలియలేకతుచ్ఛమైనా| మోహము చేజిక్కియున్నావూ |ఓహోజీవాశివూ|| ఆహానుబూరికెగడవేవూ|| దేహ|| సూటిగాశృంగాటకమునా | వాటముగనూపరంజ్యోతి | దీటులేకవెలుగుచున్నది||ఓజీవాశివూ || పాటకాద్రికూటమెకాల్చవే || దేహము || కావూదేహమింద్రియములూ | గావుప్రాణాపానాములును | కావునీవుమనసుబుద్ధియు||ఓహోజీవాశివూ|| భావరహితాకేవలాత్మావు||దేహ||అందామైయానందామైతా|సందియములడిందాజేసి| అందుఇందుసందులేకనూ ||ఓజీవాశివూ|| యెందుజూచితందేయున్నావూ ||దేహ|| ఆగమాంతమునువేగా | బాగుగా వెంకటరామ | యోగినాగదాసుకొనగేను ||ఓహోజీవాశివూ|| త్యాగివైనిజభోగమొందావె||దేహము|| ||౩౬||

మేలుకొలుపు పాట.

మేలుకొనవెజీవగగనము - నీలవర్ణంబుగనుదోచియు - తారకలతో చలించెంపరిక్తగుజాలివిడిఖండనిభముజగమని || మేలుకో || జీవామేలుకొనవే|| చావుపుట్టువుచేతమిక్కిలి - భావనికలమునొందిసద్గతి - శ్రోవగానకమూఢ

వతివైనాఘ్రయికనైనా॥మే ॥ జీ ॥ పాలుమాలియుహరినిగానక - లోలమతి వైయుండజీవితకాలముగాఆసన్నమాయెను - కడురయంబుననూ ॥ మే ॥ జీ॥ ఆశలనియెడిపాశములుదెగగోసి సర్వముకోసిఘట్టిగనాశ రహితంబైనయూ త్మనులేశమైనా మరువకా ॥ మే ॥ జీ ॥ కామముఖశత్రులసమూహము - ఈమహినిఖండింపలేకను - రామనైచరియింపముందరరాదుసుఖమూ॥మే॥ ॥జీ॥తుచ్ఛమగుసంసారభోగము - యిచ్ఛయింపగమోక్షమొసగెటి - సచ్చ రిత్రునిమనమునందునసన్నుతింపుడునూ ॥ మే ॥ జీ ॥ మనసుబుద్ధియుమేంత్రు లైదుర్మార్గవృత్తినిద్రిప్పి నినుయాతనల బెట్టగనంత్యమునశమునకునిచ్చేదరూ ॥మే॥జీ॥దుష్టజనసంగమమునూనియు - శిష్టజనముల సేవబూనియు - అష్టమ దములద్రుంచిబ్రహ్మానందమునబొందా ॥ మే ॥ జీ ॥ నాకుదోచినజ్ఞానమార్గ మునీకుజెప్పితి నిశ్చయము యీలోకవాసులు - బొవ్యాపోకల బోకయి కనేకాక్షివై ॥మే ॥ జీ ॥ ధరలో వెంకటరామగురువరుదలచిసండడినాగదా సును - విరివిగాయీవాక్యములుభువి వినగబరౌసుఘట్టిగా ॥ మే ॥ జీ॥ ౩౭

## లా లి పా ట.

లాలిశ్రీరామలాలీమునిహృదయ। లలితపంకేరుహాక్షివాలిమదవిపినకీలీ। మముబ్రోవువరమతినిసుగుణశాలీ ॥ లాలి ॥౧॥ తరణికులజలధిసోమ-యతివృ జిన దనుజ సందోహభీమ । సురమౌనివినుతనామా । మారీచహరణ దైవ లలామా ॥ లాలి ॥ ౨ ॥ సీతాహృదాబ్జమిత్రా - నీలజీమూతసంకాశగా త్ర-పాతకమనుష్యజైత్రా। నవపద్మపత్రనిభదీర్ఘనేత్రా॥ లాలీ ॥౩॥ మునివి నుతసుగుణవారా । గిరిరాజతనయచేతోవిహారా । వనధిగర్వాపహారా - పొగడనావశమునినుదురితదూరా ॥ లాలీ ॥ ౪ ॥సగుణరూపంబుదాల్చిలోక ములుసర్వమీవయ్యునిల్చి - యగుణమైనాత్మదల్చిపరమాత్మవైతివతిమాయ గెల్చి ॥ లాలీ ॥ చంద్రికసమానహాసానవరత్నస్వర్ణమండనవికాసా । సంద తినాగదాసా। హృదయనవసాహ స్రిపత్రవాసా ॥ లాలీ ॥ ౬

## మంగళహారతి.

మంగళాకరుఁడునై మహిలోపలనుసర్వసంగంబులనుబాసిసమబుద్ధితో రంగుమీరగనాత్మ సంగినైయెప్పుడు మూడంగంబులకుసాక్షినైనసద్గురువునకు ॥ మంగళంమంగళం । సద్గురుజయమంగళంమంగళం ॥ ౧ ॥ కోరిమోక్షముతమ్ము జేరిసేవించినవారికెల్లనుమహావాక్యచతుష్టయం । తారకమంత్రంబుదయతోనుబోధించిభూరిబాధలుమాన్పిబ్రోచేగురుస్వామికి ॥ మంగళం ॥ ౨ ॥ అమరఁగప్రాణాయామాదియోగములచే శ్రమబొందకుండనిశ్చయముగానూ । సుమతులకెల్లనతిసులభంబుగానాత్మ క్రమమునుపదేశించెఘనగురుమూర్తికినీ ॥ మంగళం ॥ ౩ ॥ భావింపగాతత్వమసియనువాక్యంబుచే నీవె బ్రహ్మము బ్రహ్మమీవెయనుచూ । కేవలాత్మనుజూపకటుకతటుకనదెల్పిధీవర్యులనుబ్రోచెదేశికేంద్రునకూ ॥ మంగళం ॥ ౪ ॥ యెరుకచేతనెపుట్టియెల్లలోకంబులుయెరుకచేతనెపెరిగియెరుకయుండే । స్థిరముగలయమర్త్యసరణిసాంగంబుగాకరుణాతోబోధించేగురురాజచంద్రునకూ ॥ మంగళం ॥ ౫ ॥ పాలునీళ్లనువేరుపరచు హంసమురీతితాలిమినాత్మనాత్మలరెంటినీ । చాలవిభజనజేసిసచ్చిదానందాత్మకీలుబోధించిమమ్మేలెయాచార్యునకు ॥మంగ ॥౬॥ శివజీవైక్యవిచారమవిరళంబుగదెల్పి । భువిలోకారణగురునైయువలమరియూతవిలిసంశయములను దగ్ధంబుగాజేసిసవినయంబున విహితాచార్యుడౌగురువునకూ ॥ మంగళం ॥ ౭ ॥ అరయవెంకటరామగురునిశేవించియీధరనుసందడినాగదాసుకవీ । సరసంబుగానీరాజనములొసంగెనుపరతత్వములనుదెల్పెగురువర్యునకునూ ॥ మంగంమంగళం ॥ సద్గురుజాయా ॥ ౮ ॥

## మంగళహారతి.

మంగళముదురితములమాన్పిబ్రోచెటిహరికి । మంగళముపురుహూతమకుటమణికీ । మంగళముసర్వమునిమందారునకునిత్రుడు । మంగళముమమ్మేలుమాధవునకూ ॥ జయమంగళం । సదాశుభమంగళం ॥ నిర్వికారతం

బునైనిషట్కంకంబునైసర్వదృశ్యంబునకుసాక్షియగుచూ । గర్వచిత్తులకును గనరాకవెలిగేటనిర్వాణనాధునకునిగమవేద్యునకూ ॥ జయమంగళం ॥ యే కమైయున్నతానేమిగాకయునుండె । సాకారమునక్రీడసలుపగోరి । లోక త్రయంబులనుసాకినిర్మలుడయ్యు । నాకంబునొందించునారాయణునకూ ॥ జయమంగళం ॥ హంసస్వరూపునకునాదిమధ్యాంతముల । హింసలునులేని విశ్వంభరునకూ । సంసారమనుదుఃఖసాగరమువెడలించు । కంసహారునకు బలిధ్వంసికైవుడూ ॥ జయమంగళం ॥ తాపత్రయాదులనుబాపితననిజరూపు। జూపిబ్రోచేగురురూపునకును । తాపసులరక్షించిదైతేయులనుబట్టి । రూపుమాపినజగద్వ్యాపకునకూ ॥ జయమంగళం ॥ కామజనకుడుదాసగణ మునేలుటకువైభూమిలోవెంకటరామయార్యా ।నామమునుధరియించినాగ దాసునిబ్రోచెస్వామిశ్రీకోదండరామునకునూ ॥ జయమంగళం ॥ ౩౮

## మం గ ళ హా ర తి.

బిళాహరిరాగం।ఆదితాళము.

చెలులుమంగళమానరె । శ్రీసతికిహరికి । చెలులుమంగళమానరె ॥ జలనిధిప్రియపుత్రికీ । జలజసన్నిభనేత్రికీ । జలధరాసితమూర్తికినివిస్తార కీర్తికిసర్వమూర్తికి ॥ చెలులు ॥ చారుసైకతశ్రోణికీ।జితచంచరీక । వారనీల వేణికీ । కీరసన్నిభవాణికీ। వారిసంభవపాణికీ । దారితారిశ్రేణికినివందారు మందారునకుచక్రికి ॥ చెలులు ॥ కమలలోచనుదేవికీ । కమలాలయకునూ ॥ కమలసన్నిభతావికీ । విమలవిద్రుమమోవికీ । వినమితాఖిలజీవికీ । సమదరిపు సంహారికిని । భవతిమిరహారికిని । త్రాణకరికిని ॥ చెలులు ॥ మరునిమాతగు నాతికీ । తనుసేవించే । నరులనిత్యవిభూతికీ । నిరుపమానసునీతికి । నిత్యని ర్మలఖ్యాతికీ । పరమకరుణోపేతునకుశ్రీపతికికాంచనశైలధృతికీ ॥ చెలులు॥ హరివక్షస్థలవాసికీ । త్రైలోక్యమాతకుపరమసద్గుణరాశికీ । పరమృదు భాషికీ । వసుధసజ్జనపోషికీ । ధరనుసందడినాగదాస । వరదునకుమంద రధరునకు ॥ చెలులుమంగళమానరె ॥ ॥౩౯॥

